 శివాయనమః.



# శివశతకము.





దరిమడుగు రోశయ్యకుమారుడు వెంకటసుబ్బయ్య చే
రచియింపబడి ప్రచురింపబడినది.



ప్రొప్రయిటర్సు:
కె. శ్రీనివాసాచారి అండ్ బ్రదర్సు వారి
భగవాన్ ముద్రాక్షరశాల యందు ముద్రితము.
మదరాసు.

1942

శ్రీరామచంద్రాయనమః

# పీఠిక.

---

శ్రీ శివశతకము అను ఈ పొత్తమును శ్రీ వేంకటసుబ్బయ్య గారను శివభక్తులు రచించియున్నారు. గ్రంథమునందు భక్తి రసమును నీతిబోధయును గనుపట్టెడిని. శైలియు సులభము గాను పొంకముగాను ఉన్నదని చెప్పవచ్చును. కొన్ని పద్ధతులను బట్టిచూడ ఇది గ్రంథకర్తగారి ప్రథమ ప్రయత్నములలో నొకటియేమో యని తోఁచుచున్నది. అయినను ప్రథమదశలోనే యింత చక్కని కృతిని దీర్చువారరుదు అని నాతలంపు. అంతియగాక భక్తిరస ప్రధానములగు గ్రంథములకు "చెఱకు వంకతోఁడఁ జెడునె తీఁపు" అను పెద్దల వాక్యము రక్షణ యున్నదిగదా? "ఈశ్వరాద్ధనమిచ్ఛేత్" అను ప్రమాణము సమస్త సంపత్తు దుండయిన శంకరుని యనుగ్రహమున ఈ గ్రంథము ఇహపర సౌఖ్యములకుఁ గారణముగా నగును. ఈ గ్రంథము నచ్చొత్తించుటకుఁ దగు మొత్తమిచ్చి గ్రంథకర్తను ప్రోత్సహించిన శ్రీ చీర్ల శింగరయ్యగారు శ్రీ శివానుగ్రహమునకు పాత్రు లగుదురనుటకు సందేహ ముండదని నా యభిప్రాయము. గ్రంథకర్త

గారి రీతిగానే భవిష్యత్తున ననేక గ్రంథములను వ్రాసి ప్రకటించియాంధ్ర భాషామోషను సేవించి కీర్తిశాలురై సమస్త శుభములను జెందుదురు గాత యనినా శ్రేయోభిలాష.

ఇట్లు,
దోమా వెంకటస్వామి గుప్త,
122, వరదాముత్తియప్పన్ వీధి,
జి. టి. మద్రాసు. 9-2-42.

---

ఉ॥ భార్యయుతాన్ మఱిన్ సుతలు భక్తి నిచ్చలుం గొల్చుచున్ నినున్
ఆర్య మహాసతీ సహిత యుంచిత భంగిం దలంచు చుండుటన్
కార్యమిదే యటంచు మదిం గాఢపు భక్తిని శింగరాజ్యుడౌ
యార్యుడు చిన్నవంశజుండు యచ్చును గూర్పగ జేసె శ్రీ శివా॥

ఉ॥ గర్వములేక మానసము గాఢపు భక్తిని బూని సేవయిన్
సర్వజనంబులన్ గనుచు సాదర భావముతోడ నిచ్చలున్
సర్వగ! మాన్యుడై చెలగు సజ్జను శింగరనామ ధేయుని
ర్భార్యను తావళిన్ మనుపు పాలితలోక చరాచరప్రభో! శివా॥



శ్రీ

# శివశతకము.



1. శ్రీ కరునాదిదేవు నలశీతనగాధి పవాసుడౌవిభున్,
ఆకమనీయ నామునిను, నాతత్ప్రేమనుగాతువంచునే
నోకళుషాంతకాతలతు, నుర్విని, ప్రోవగనన్ను, రాగదే
శ్రీ కమనీయ రూపయుత శ్రీ వరమిత్రయు మాధవా శివా॥

2. నీ కిలపక్షపాతము వినీలగళా కలదేయటయ్యునిన్
నేకరగింప నేరకిటు నీచుడనై ధరసొమ్మసిల్లెదన్
శ్రీకరభక్త మానసవ శీకరుడౌచునుయే వెద భువిన్
నాకలు షంబడంచిదయ నన్నిపుడేల నో ప్రోవమిన్ శివా॥

3. భావములందు చర్చ్యజరుపంగనినున్ పలుమారు భక్తులే
తావకభూరిశక్తిఁ గనధారుణిఁ జాలమటంచు నెంతురో
శ్రీవరమిత్ర నీదయిన చిత్తమెఱుంగ ఫణీశహారనీ
పావనపాద పద్మముల భవ్యమతిన్ దలపోసెదన్ శివా॥

4. ఎంత దయాకరుండవని యెన్నియుగంబులు తల్పగానగున్
ఎంతటి మాయకాడవని యెన్నియుగంబులు యెన్నగా
నగున్
ఎంతటి ధీరుడంచునిను నెంతయొ తల్పగనౌ ధరాస్థలిన్
మంతచరిత్ర శ్రీయుభవవేద్య భజించెదనిన్ను శ్రీ శివా!

5. నిన్ను దలంప ప్రొక్కగను నిల్వ వానియమంబు లేలనో
నిన్నుగనంగ దేశములనే వెదుకన్ వలె నాక్కొ శంకరా
ఎన్నడు నిన్నునే తలచి నెట్టిదశన్ గొలువంగనేలవా ?
వన్నెల మన్ననన్ సలుపు నాదనవందిత నామ శ్రీ శివా॥

6. పుష్టులఁ జేయుచున్ మఱియు తోరపు భక్తిని భక్త
సంతతిన్
కష్టములందుఁ గాచుచున్ కాంచన గర్భసుతాఖిలాధిపా
శిష్టసుతా మహాగుణాధి చెందెదు కీర్తినియట్టి నిన్నుదన్
యిష్టముతోన దించెదను యోలెద వంచును మ్రొక్కు
చున్ శివా॥

7. అంతములేదు కోర్కెలకు యంతకవైరియు మానసీధవా
ఎంతయు భక్తినన్నినిల నేలుము కోర్కెలదీర్చుచున్
విభూ
నంతయు నీమహాత్మ్యమును శోభన ప్రాయమునే నెఱుంగనో
వింతచరిత్ర పాపహర వేడ్కను దింతును కావుమా శివా॥

8. నాదు భవాబ్ధినిన్ దెలుపనాకు దొఱకెంపగ కష్టమౌగదే
నీదు కృపాలవంబయిన నేనిట బొందనిచో దయామయా

నాదగు కష్టనష్టమును నారదవందిత పాప పద్మసోమా
భూధరవాస తెల్పెదను బ్రోవగరాగదె వేగమే శివా॥

9. నిద్దుర లేచుచున్ సలుపని పవనారసయుగ్మ చింతనం
బెద్దురి తాత్మునైన వెసనేలెదు కష్టములెల్ల పాయగన్
త్వద్దయ నాశ్రయించిగదె ధామిని నెల్ల నటించుచుందుటన్
నిద్దయ భక్తి జేసితి, తెలసహారా హరకావుమా శివా॥

10. చూచుచు నన్ను ప్రేమయుతచూడ్కులతోడ మహామహుండవై
బ్రోచుచునుంటె నీవెపుడు బోలను నాకొకడైన నెందునున్
కాచెద పాపముల్ మఱిని కామయ సౌఖ్యములందుచుండెదన్
బ్రోచెదు భక్తులన్ యథన మ్రొక్కులకైకొని నిత్యమున్ శివా॥

11. పాలనసేయగా పరమపావన మూర్తివి నీవు యుండవై
ఏల భయంబు నెట్టుననునే లెదు శ్రీకరభూత నాయకా
కాలుని దూరఁజేసె మునునాథపుభక్తిని బూని నీదుపై
శ్రీ లలితాత్ముడై మొక్కను చింతిత సత్ఫలదాయకా శివా॥

12. గంగను లోకపావనిని కల్మషహారసునామ యుక్తనున్
పొంగగ శీర్షమున మదిరంజిల ధారణఁజేసి చంద్రునిన్
అంగజ నాశకాంచుటులె హర్షమొసంగ గదాల్చి ధీరతన్
పొంగుచు మ్రింగియుక్ విషముపొల్పు వహించితివౌర శ్రీ శివా॥

13. నిశ్చల మానసంబున నెనిన్నిల సంస్మరణంబు సేయఁగా
నిశ్చిత భక్తి నీదయిన నిర్మలసేవను సల్పఁగా విభూ
నిశ్చయ మూనెదన్ హృదిని నిల్వద దే మిత్వదీయ
మాయయో
నిశ్చయమైన శ్రద్ధయును నేర్వనో మన్నన సేయుమా
శివా ||

14. ఈవు మహానుభావుడవు యిచ్చెదు నమ్మిన కోర్కెలంచునీ
పావన పాద పద్మములఁ భాసుర భంగిను తించెదన్
మదిన్
ఈ వొసగన్ తలంపమిక నిచ్చెదు వారలు యేరి చూపుమా
ప్రోవగ కర్తవై యిపుడు ప్రోవగరా విటు పాడియే శివా॥

15. పాపపువార్ధి లోఁబడుచు పారముగానక స్రుక్కు నన్నునీ
వోపిక లేవనెత్తుచును యొప్పుగమన్నన సల్పగా దగున్
కోపము సేయకీ విపుడు కోమల భంగిని యెంచగాదగున్
నా పడుపాటులన్ కరుణ, నారద వందితనామ శ్రీ శివా॥

16. ఏవియు నీవు నామొఱలు యెంతయు నాలన సేయవైతివో
భావము నందునన్ను నిలపాలన సేయవైతిగా
పావను డంచునిన్ను నెదపావుడనయ్యును ప్రోవవేడెదన్
ప్రోవగ త్రోయగా తలపముఖ్యుడ నీవెను రావనా శివా॥

17. పేదలసాదలన్ మిగుల ప్రేమను జూడక వారియందువే
క్రోధము జూపుచున్ మఱియు క్రూరత గర్విత మాన
సంబులన్

వాదమొనర్చునన్ విరుగఁబారిన ఖండము దోన్నతా
ఘులన్
వేదన బొందజేయుహా కా పడితశాత్రవ వర్గ శ్రీ శివా॥

18. సేవల బొంకు వాకిటను నిశ్చలసేవకు భాతినుండువో
శ్రీవర మిత్రమౌ యుభవ చిత్తము నచ్చెన సేవసేయగా
ప్రోవగ భక్తులన్ కరుణ మోదము నందెను నాగభూషణా
ప్రోవవెనన్నిలన్ దయను, పోవగజేసి యఘంబులన్ శివా॥

19. దక్షుని యాగమున్ జెఱచి దర్పమడంచెడు వేళ నీకునే
దక్షుడు నడ్డమున్ పొరడు దర్పకదర్పహరాక్షపామయా
శిక్షితదాన వాయభవ శీతకరానల భాస్కరాక్షపా
పక్షయ నాపనిన్ దలతుపాలన సేయుమ యానసున్
శివా॥

20. లోకములన్నియున్ తలపలోకువె నీకు సదాశివావిభూ
లోకములన్ దయన్ మనిపి లోకులచేతనె పూజలందెదో
శ్రీకమ నీయ రూపయుత చింతిత సత్ఫల దాయకాయివే
వే కరుణన్ నతుల్ గొనుము పీడితదుష్టజనోత్కరా శివా॥

21. భావము శూన్యమా రసము, వ్యంగ్యసమృద్ధములున్
గలుంగవి
తావక పద్యముల్ వచనధాటియు లేనివియా గదే విభూ
నీపురసజ్జుడౌట నెటునే నొనరించెడు నీరసంబులౌ
తావక పద్యముల్ వినెదు ధారుణిఁజూడు కృపన్ శివా॥

22. భావము శుద్ధమై మిగుల భక్తినినిన్నుదె పూజసేయుగా
రావణ గర్వ హారక వినాగులు సంతత ముత్సహింతురో
భూవర దేవతా వినుతపూత చరిత్రయు మాధవా విభూ
నీ వరభక్తుగా సలిపినేర్చున బ్రోవుము నన్నిలన్ శివా॥

23. పాపిని భావ శూన్యుడను పావక లోచనయంత కాంతకా
పాపుచు నాయఘౌఘులను పాయగ బోకుము నాదు
చెంతనీ
వోపికమై నిరంతరము యూర్జిత బారితపః ఫలాహరా
శ్రీ పరమాత్మయో యభవ సేతువు నామదిధ్యానమున్
శివా॥

24. భక్తుడనౌట నీకరుణఁ బ్రాపక నీమది నిత్యమున్ నన్నున్
శక్తి విహీనుడం చెఱిగి శాంతముతో నపకార పాళులన్
ముక్తిదత్రోసివేయగదె మొక్కెద నిచ్చలు నీకు భక్తిమై
భక్త జనావనా బిరుదభాసుర రూపయు మాపతీ శివా॥

25. శ్రీ భవనామయో హరసురేంద్రనుతామల పాదశంకరా
యీభవ సాగరంబు నిటనీదగ రాదని తోచుచున్నదే
మీభవ నాశ కామదిని యీవు సహాయతఁజూప వైతిగా
శ్రీ భరితావ నీతల విశేషగుణాకర కావుమా శివా॥

26. సారము లేని దంచునిట సారెకు సారెకు తోచుచుండుటన్
భారమునయ్యె సంసరణ భారము మోయగ నాకు శ్రీభవా
సారస పత్రనేత్రుడవు సన్నుత నాముడవౌట నీవెగా
తోరపు భక్తి సేయునను తూర్ణమ కాతువు నమ్మితిన్
శివా॥

27. నీ కమనీయ పాదముల నెమ్మది మ్రొక్కెద పాపముల్ వెసన్
పోకడజేయవే కరుణ భూనుత నామను రావనా విభూ
శ్రీకరభాన భక్తనుత విచిత్ర విశాల చరిత్ర మ్రొక్కెదన్
నాకజ భూమిజాళినిను నాథ! తలంపగ లేదయా శివా॥

28. నాగవిభూషణా యభవ నారద వందితనామ శ్రీకరా
ఆగమ వందితా సతమునాదర ముంపుము నాపయిన్ భవా
శ్రీ గుణ సంయుతా మనుపు చిత్తము నీ వశవర్తి యౌనటుల్
భోగము రోగమెం దలపపొందెద నీదు పదంబులే శివా॥

29. భూసుర దేవతావరులు పొందుచు మోదము నీస్తుతిన్ మదిన్
భూసురభంగి సేయుటను భవ్యగుణాకరు వైరి కాదొకో
యీసునుం జెందు నీవయిని యీశ్వర యిగ్గరె యేరునైననో
భాసిత భస్మ దేహనిను భక్తినిఁ గొల్చెద కావవే శివా॥

30. ఉ॥ శోభిత సద్గుణాయ భవశోకము సంసరణంబునన్ వడిన్
తా భరింపలేని యటుతాకెడు మానవు మాటిమాటికిన్
నీ భవహారతన్ మిగుల నెమ్మిదలంచుచు నిన్నె గొల్చుచున్
యే భయ మందరయ్య మది నెయ్యెడ నీదగు భక్తువే శివా॥

31. శోవిదపూజ నీయగుణకోమల పూరుష వర్యయోహరా
కావగ మాయెడన్ దయను కల్మష హర్తవు భక్తకాదువో
శ్రీవరపూజ నీయపద చిత్తము నీ పయినుండ నిత్యమున్
నే వర మొక్కటే తలతు నేర్పున నిమ్మువడిన్ కృపన్
శివా॥

32. మత్సర జీవితాతిభయ దూరునిగాగ నొనర్పగానన్
నిర్భత తేజునిన్ నిను వినీలగళున్ మదిసన్నుతించెదన్
అర్భకుడన్ జడుండ మతియార్తుడ భక్తుడ దీనుడన్
విభూ
నిర్భయతన్ మనంగనిలనీదగు సేవ యొసంగుమా శివా॥

33. తప్పనిదాను నాపనియు తప్పదు లోంగుట నీతఱిన్ భువిన్
యెప్పనికైన వేయొరులకెంత యునంచును తల్పనానాకో
ఒప్పదు లోంగుటల్ పరులకోహర శోభిత సద్గుణాకరా
ముప్పగదా తలంపనటు మూర్ఖత దాస్యము సేయుటన్
శివా॥

34. ఉ॥ మానష సేవసేయగను మానము బోవుటెగాక
కూరదే
దేని ఫలంబు యెంతయును నెట్టితఱిన్ ధరణి తలంబునన్
మానుచు వీరిసేవవెస మానక సల్పగనీదు సేవనే
మానును దేహతాపములు మానిత సౌఖ్యము లబ్బుచున్
శివా॥

35. ద్వేషము పెంచుకొంచు సతి తెంపున మాటల మీఱు
వడిన్చున్

దోషము లెంచకుండ మతిదూరత నెందును భిన్నభావులై
వేషములందు భాషలను వీడని మోహము గల్గియున్ మత్రిన్
ద్వేషము మానకుండ మరి దీక్షకులందున భావ్యమా శివా॥

36. నీ వాక్కపాలు సల్పెదవు చేర్పున మానవులారు పాల్గిలన్
భావము లందు శ్రద్ధగొని పాటుపడన్ కెలసంబుకై యటేన్
ఏవియు విఘ్నముల్ కలుగ నెంతయు నోడి ఫలించు కార్యమున్
వే విధముల్ నినున్ హృదిని వీడక భక్తి దలంతు శ్రీశివా॥

37. సర్వదిశా వళిన్ వెలుగు శంకరనాముడవయ్యు యేలనో
సర్వగ! కానరా వెపుడు చక్షుల కెందును చంద్రధారణా
సర్వము సల్పగా మనువ సంహారణంబును సేయ బాలెదా
సర్వజగంబులున్ తలపచాలునె నీ మహిమావళిన్ శివా॥

38. మోహన రూపివై జగము మోహము నందగ వీల సేయుదా
శ్రీహర వేద వేద్యుడవు శేముషి పూగము కొల్వ నొప్పచున్
శ్రీహరి సన్నుతా ఖిల విశేష గుణాకరు డౌదువో ప్రభూ
వేహాతమొంద పాపము వివేకమునబ్బ నొనర్పుమా శివా॥

39. నిన్నుగనంగ గోరెదను నిర్మల భక్తిని నెప్పుడేనియున్
నన్నుగనంగ వచ్చితివె నాకడకీ వెపుడేనియో హరా

నన్నిటు పాయగా తలపనాయమె నీకు మహేశ్వరా విభూ
సన్నుతమౌని చంద్రదళ సంకట నాశన మ్రొక్కెదన్ శివా॥

40. ఉత్తమమైన త్రోవల నెనుత్తము లెప్పుడు పోదు రెయ్యెడన్
ఉత్తముడౌ నినున్ కరుణ నూతగ కే లొసగన్ దలంచెదన్
ఉత్తమ భంగిపాప నిధినొయ్యన దాటగ గోరుచున్ విభూ
విత్తము గోర కొల్చెదను వేడ్కను నీపదయుగ్మమే శివా॥

41. భక్త జనావనా విమల భావయు పార్వతి కోటి తేజమో
ముక్తి సతీశ్వరా యభవ మోక్షద కేల్లవ నీకిదే విభూ
రక్తిం గనంగనన్ను ధరరాజ ధరావిను నీవె చాలెదో
శక్తిను తాభవా మనువుసాంబ! దయాకర శంకరా శివా॥

42. రక్కసులన్ వడిన్ దునుము, రాజిత మూర్తి వియాచు నీవిలన్
మక్కువ బ్రోవగా భువిని మాన్యుల సజ్జన వర్యులన్, వెసన్
మొక్కెడు శ్రద్ధ బూనుచును యిందిరనాయక మిత్రమా హరా
చొక్కపు వేషముల్ సతము శోభిత భంగిని దాల్చెదో శివా॥

43. ముప్వురు సూనులున్ గలసి మోదమునన్ నినుగొల్తు రెప్పుడున్



అబ్జనాక్షి పార్వతియు హర్షమెసంగగ గంగయునెమ్మి
మువ్వుర మూర్తులన్ తలప పూజ్యుడవంచును గూడి
యింద్రునీ
కవ్విధుముండు పువ్వునగ నంచితభంగి శిరంబునన్ శివా॥

44. సర్వమునేలు కర్తవట స్వల్పుడవై ధరనున్న నన్నిటుల్
శర్వ! దయామతిని గనగ జాలవొ తల్పగ చిత్రమయ్యె
డున్
సర్వ విదూరుగా నలిపిగాఢవు ప్రేమనుజూడు మానసున్
సర్వము నీవశంబగును శక్తియు తాయిదె మ్రొక్కెదన్
శివా॥

45. నంది ముఖంబునన్ బొడమినవ్య ఫలంబుల గూర్చుచున్
వెసన్
మందము మందమాగమున మంచిత భంగిని సల్పుచుండునా
సుందర మాపినాకిని సుశోభిత తీరమునందు నిల్చుచున్
అందముగాంగ గైకొనుచు నర్చనలన్ ముద మందెదో
శివా॥

46. చేలముగా ధరించెదవు చిత్రము రంజిల దంతి చర్మమున్
నీలగళాయ లందెదవు నేర్పున భస్మము నీదు మోమునన్
తాలిమి సంచరించెదవు దారుణ ప్రేత తలంబునన్ విభూ
కూలగ జేసి నాయఘము కూర్పుశుభంబుల కూర్మిమైశివా॥

47. క్రాలెదు నాగహారముల కాంచనవర్ణ సురేంద్ర పాలనా
క్రోలియు ఘోరమౌ విషము కూర్చెదు సంతసమున్
భవన్మదిన్

కాలునికీ వెగా తలప కాలుడ వౌదువు సంకటాంతకా
పోలునె నన్ను గావమని పోషితసజ్జన వర్గ శ్రీ శివా॥

48. శూలముచేత నీ వెపుడు సూరిజనావళి వైరులన్ వెసన్
కూలగ జేతువంచు నెద కోర్కె భజింతును నిన్ను నిచ్చలున్
కూలగ నార్గురున్ రిపులు కూరెద మోదముగాన, సేయుమా
వైళమయట్లు, భక్తజనభావ విహార మహాప్రభూ శివా॥

49. ఏమని విన్నపంబు వినిపింతును సర్వము నీకు వేద్యమా
నేమముతోడ గొల్చుటయె నిన్నెద నిచ్చలు నాదు కార్యమా
శ్రీ మహితా! యఘంబులను శీఘ్రమ త్రోయుట నీదు కార్యమా
నీ మహిమంబు నెన్నగను నిన్ను నెఱుంగను జాల శ్రీ శివా॥

50. అక్కర వేళ నిన్ను మది నాతురతన్ దలపోసియున్ తుదిన్
చిక్కుచు నింద్రియంబులకు చిత్తమునీదు పరంబు జేయమిన్
చిక్కులఁ బొందగా ఫలము చిక్కునె సుకృతంబుగాదొకో నరుం
డెక్కరణిన్ సురేంద్రనుత యిందిరనాథ హితాభవా శివా॥

51. నారక బాధలు నరుల నారత భక్తిని నిన్ను గొల్వగా
చేరవు నిర్మలాత్ములయి చెందుట కీర్తిని వారలన్ నిజం

జా రమణీయ రూపయుత యంబహ్మాదీశ్వర యీశ్వరా
హారా
క్రూరజనాళి సంహారణ కోమలగాత్రను రావనా శివా॥

52. నీపదపద్మ సంస్మరణ నిచ్చలు నీయమినాకిల నీకు చెల్లునే
నాపలు దోషముల్ యుడిపి నన్నుదయన్ గనగాను
తించెదన్
శ్రీ పరమాత్మ నీలగళ చింతిత సత్ఫలదాయకా భవా
తాపస లోకవందిత పదాంబుజ సూరిజ నావనా శివా॥

53. నీవన కొందరున్ మరియు నీరజనాభు డనంగ కొందరున్
యీవసుధాస్థలిన్ యభవ యేలొకొ యార్యను జెందు
చుండుటల్
నీవును శౌరియున్ తలప నిక్కముగా నొక మూర్తిగా
దోకో
పావన పాదపంకజ యుగ పాపము నాయఘ పుంజమున్
శివా ॥

54. భక్త జనాళులన్ మనుప పర్విడిపోయితివో మహాదయన్
రక్తిని నృత్యమున్ సలిపి రానిటు యాలము సేసెదో
హారా
ముక్తిని నీయరా దెవుడు మూర్ఘున కంచునన్, దలంచెదో
శక్తి విహీనుడన్ మనుప జాలియురా విటుయేలనో శివా॥

55. ఉ॥ ఆనల రాజ మనుమని యాలొనరించెను నీవ్రతం
బిలన్
మానితభంగితన్మగడు మ్రందక నీరమునన్ మనంగగా

మానవ దేవతా వినుతమాన్య చరిత్ర! క్షమింప జేయవో
మానిని సల్పినా ప్రతిమ మానుష భంగిం దయామతిన్
శివా॥

56. ఉ॥ నీపయి భక్తిచే జనము నిశ్చలమానసులై చరింతురో
పాప ఘనావళీ యనిల! పాలిత భక్తజనావళీ విభో
పాపుచు నాదు భీతినిల పావను జేయుచు జన్మధన్యమై
నీపద సారసంబులను నిచ్చలు తల్పగ జేయుమా శివా॥

57. ఉ॥ పావన పాదపంకజ యపార దయాకర యార్య
పూజితా
కామము పాపసంకిలము గాక జెలంగెమనట్లు నాథ నం
దీవసుధాస్థలిన్ కరుణ యిందిరనాయకమిత్ర సుప్రభా
తీవరమంది నామనము ధీయుతు నిన్ను గనంగ శ్రీ శివా॥

58. ఉ॥ క్రూరజనావళుల్ మిగుల కోపయుతుల్ మత్సరాన్య
మానవుల్
నీ రసభావులున్ దలప నేరరు నిన్నిల నెట్టివేళలన్
తీగని కష్టముల్ మరియు తీరని యాపదలెన్నియో నియ్యన్
వారికి కల్గుచుండుగదె వారల తీవ్రతరంబుగన్ శివా॥

59. ఉ॥ డాంబికమైన యట్టిపియు టక్కరి గిక్కరి మాయ
మాటలున్
శంబర వైరి వైరివ్వాడ సంకరు వేగడె నేర్చియామాటల్
కంబుగళా నిన్నున్ దలతు కల్మష నాశమ్ముకై నిజంబుగా
డంబును లేనునాకు నుతి టక్కరమాయలు లేవయా శివా॥
శివా ॥

60. ఉ॥ అజ్ఞతమాన సంబవుఁడు నంత దయాకర ! చిక్కు
గ్రుక్కెడున్
విజ్ఞత గల్గగా నలువు వేఁడద నీదు ప్రపత్తి నిచ్చలున్
ప్రజ్ఞ గలట్టివాఁడవని భావమునన్ నిను మ్రొక్కుచుండెదన్
అజ్ఞుల నెంచరన్ మనిషి యందవు కీర్తిని పూర్వమో శివా॥

61. ఉ॥ ఒంటరివాఁడనై భువనమునో మగనన్నోరు వేసతేమిచే
తంటల చిక్కులన్ బడుచు దారుణ కష్టములందు
చుండుటన్
దంటవటంచు నన్ను నప దారితకల్మషు నిన్ను గొల్చెదన్
వెంటనె దీనుడీతడని వేడ్కతో కావగరాగదె శ్రీశివా॥

62. లోకములన్నిటన్ మనిషి లోపములెల్లను శాంతు జేయునో
లోకపతీ నినున్ దెలియ లోకుల కష్టులు భక్తులయ్యె శ్రీ
నాకజ సన్నుతా తలపనాతర మెట్లగు నంతి వాసి,ని
న్నేకలు పొంతకా హృదిని యెంతయు రక్తిని బ్రోవు
శ్రీ శివా॥

63. ఉ॥ కోరికలెల్ల తీర్చుముని కోరుచు నస్మృతి నల్పుచే,
నినున్
కోరికలేక నిన్ను హరు కోరక నాత్రుతను తీర్చనైతినో
భూరికృపామయా పరమ మూర్ఖుడ నన్నెటుగావు
వీధరన్
నూరిజ నావనుండనగు సద్గుణ యఘుసంహరా శివా॥

64. ఉ॥ మానసమా! హరిన్ విమల మానసు దేవదళాది
వందితున్

మానిత భంగి నెల్లపుడు మర్వఁగరాదని, యాజ్ఞసేయఁగా
మానని మూర్ఖతన్ వినదు మారహరా ఘననాగహారిణీ
మానిత పాద తాడనమె మందగు తప్పఁగదానికిన్ శివా॥

65. ఉ॥ కొండలవంటి పాపములు కాలుద భాలు మటాచు వైళమే
చండులు మానుషాశనులు చత్తురు భీతిని తత్క్షణంబునన్
మండిత రూప! నీదగుయమానుష తేజము జూచినంతనే
అండవు నీవెనాహో కోజగంబులఁ గావఁగ నిచ్చలున్ శివా॥

66. ఉ॥ నిన్నుమనంగ నీయనని యెత్తెనుచేయిని నీదుపైననే
మున్నిల భస్మ రాక్షసుఁడు మూర్ఖున కిచ్చెదు దివ్య మావరం
బెన్నఁగ చిత్రమాఁగదవె యొంతయు నీదు చరిత్ర శంకరా
మన్నన సల్పుచున్ కరుణ మమ్ములఁ జూడుము శీఘ్రమే శివా ॥

67. ఉ॥ అంతము లేని భక్తినిను యంతక భంజను తించభక్తులన్
సుంతయు కావఁగా కరుణఁ జూడవు యెన్ని భవంబులందు నేన్
వింతక దానినున్ కినుక వ్రేల్చెద చీల్చెదనన్న దైత్యులన్
యొంతయు శక్తిముక్తినిడి యేలెద వెంతటివాడవో శివా॥

68. ఉ॥ ఈశను వృంము దాక గదె యీసుత వర్గము బంధు వర్గముల్
మాతలు పితృలున్ తలప మానవు నాంధ్రను గీములున్ ప్రభూ

ఆతత రక్తి నెట్టిసమయంబుల నెన్ని భవంబులకు నేఁ
మాఁయు త్రాత జనకుడు మాన్య జనావన! నీవెగా శివా॥

69. ఉ॥ ఏల సృజింప గావలయు నేలనొ యిన్ని దినాలు పెంచగా
యేలర నాదుస్వామివగు యీశ్వర నాకిల యివ్వవైతివే
వేళను ధన్యుడౌ నటుల వేడ్కను నీపద సంస్తుతిఁ హృదిఁ
యేలొకొ యిట్లు నన్ను నిటు నెంతయు వ్యర్థగ సేయగా శివా॥

70. ఉ॥ భక్త జనాళి సన్నుతుని పావత మోదివ సాధి నాధునిఁ
ముక్తి పదాధిపుఁ డుభవు మూర్ఖ జనావళి కష్టదాయకుఁ
భక్తియు ముక్తియుఁ నొసగి వత్సలతఁ జనతల్లజులకుఁ
శక్తిని మీఱు నిన్ను మది చక్కగా నెంతు క్షమింపుమీ శివా॥

71. ఉ॥ ఉత్సవముల్ జనావళులు నుత్సుక మానసులౌచు నీకిలఁ
మత్సర శూన్యులై సలిపి మానితభంగిని జాగరంబులఁ
కుత్సిత భావముల్ విడిచి కూర్చెద రెంతయు పుణ్యరాసులఁ
చిత్సుఖ మందగా హృదయ సీమల సల్పెదు భక్తులఁ శివా॥

72. ఉ. నిన్ను హృదంత రాళమున నిచ్చలు నిల్పగ నన్నుతిన్, నన్నున్
నున్నన నిల్పుచుందువని మాటికి మాటికి పూనుచుండగా
గ్రన్నన చింత లన్నియును గ్రమ్మెడు జ్ఞానముం బాయ జేయుచున్
సన్నుతుం బ్రోతువో తెలియ నారద వందిత మ్రొక్కెదన్ శివా ॥

73. ఉ. శ్రీకర నిన్ను నాత్మం గనం జెందెద కౌతుక మట్లు జేయనే
నీకలు షాడ్ధినిన్ వదిగ నెంతయు నేర్పున దాట జాలదన్
నీ కరుణా కటాక్షముల నేర్పరిం జేయుచు దర్శనంబునా
కేక్రణిన్ యొసంగెదవో యిమ్ముగం జెప్పుము మూర్ఖుడన్ శివా॥

74. ఉ. భాసుర భంగిజన్మకడు భవ్యముగాదె నినున్ మనంబునన్
నే సమయంబు నందయిన నెట్టి యెడన్ దలపోయ విశ్వమున్
వీసమునైన గుర్తిడగ వీలు పడంగను లేని యట్లుగా
భాసిత దివ్యరూప నిను భక్తిని మ్రొక్కెద కావవే శివా॥

75. ఉ. భాగ్యము మోసమున్ మిగుల నంతయు క్రూరము గల్గ జేయుచున్
త్రోవపు కష్టముల్ గుడుపు తూర్ణము మానవ పాళి కేదియా
నార విహీనమై వెలయు సంసరణంబున జిక్కి నీకుమా
భూరివసా మహామయభయ మోక్ష ఫలంబుల నిచ్చుచున్ శివా ॥

76. ఉ॥ ఏలనో తీవరించుటలు లగ వేగమె రమ్మటంచునో యే
పాలక పల్కదే మొనను పల్కద నుత్తర మాళికింపవే
ఆలయు నేయ నీ విపుడు ఆయువు పాయునో యంచు
నెంచెదన్
ఏలన నే మనుష్యుడనె మృత్యువు క్రుంగగ జాలమిన్ శివా॥

77. ఉ॥ పూర్వ కృతంబయా ఫలము బుద్ధియు తాళికి మూర్ఖ
పాళికిన్
సర్వము చెప్పదా కుడువచక్కగ నట్లయినన్ నినున్
మదిన్
శర్వ! తలంపగా సతము శాంతము మోదము జెంది
హాయిగా
సర్వక మానవుండలరు మాన్యుని నినుయు మాధవా
శివా॥

78 ఉ॥ నీ వదనాంబుజంబు నెద నిర్మలభంగిని జూడ గోరెదన్
నీ వరమూర్తినిన్ దలతు నేనిల పాపము గూలగా వెసన్
పావకలోచనా కరుణ పాలన జేయుగ రాగదే విభూ
సేవకు దీనునిన్ వడిగ జేర్పుము నీ పదమందు శ్రీ శివా॥

79. ఉ॥ కూలినచోట చిక్కువడి కూర్చుచుడు. ఖముదీనుడౌ
తజిన్
జాలుచు నాపదాళులను శుంఠల చెల్మిని స్రుక్కు వేళలన్
పాలకుడౌ విభుండు వడిఁ బాధల బెట్టిన వేళలన్ భువిన్
యేలెదు నిన్ను మానవుడు యిమ్ముగ భక్తిఁ దలంపగా
శివా॥

80. ఉ॥ చొక్కపు భక్తిచేత నిను స్తుత్యుని మోక్షసదాధి
నాయకున్
మిక్కిలి దీనతన్ దలచి మేలును సేయఁగ వేడగా హృదిన్
చిక్కవు దక్కవో రహర! చింతలఁబాపక యిమ్మహిన్
నన్నున్
యిక్కరణిన్ వెతల్ గుడువ నెంతయు చెల్లునె నీకిటుల్
శివా ॥

81. ఉ॥ నీదగు నామమే, జనుల నిచ్చలు పావన మూర్తులౌ
నటుల్
వేదనుతాపి మలాఖ్యహార వేగము సల్పెడు మానితంబుగా
నీదగు సేవయే, భువిని నిర్మల భూతిదమౌచు నొప్పెడున్
మాదు విభుండ వౌటనిను మాటికి మాటికి నెంతుమో
శివా ॥

82. ఉ॥ స్వల్ప మనస్కుడన్ భువిని శాంతి రహిత్వమునన్
మెలంగుచున్
అల్పపు భావముల్ పొడమ యర్హమ నర్హమ టంచు
నైన శ్రీ
కల్పిత లోకసంచయ యఖండ దయాబ్ధి! యెఱుంగవే
నయా
స్వల్పుని నన్ను పాపయుతు చక్కఁగ బ్రోవగ రాగదే శివా॥

83. ఉ॥ ముక్తికి పోవుదారినట పోకుమ టంచుయ ముండ
దల్చి క్ష
శక్తి విహీనుడౌదునటు సాయము సేయఁగరమ్ము దారిలో

భక్తిని గొల్చుచుండు నను భావ్యముగా దొకొ ముక్తి జేర్చుటల్
భక్తజనావనా విమల పాలిత లోక కృపామయా శివా॥

84. ఉ॥ నిశ్చల నిర్మలాత్ముడవు నిన్ను దలంపగ శక్తి లేదయా
స్వేచ్ఛవు నీదయామృతము చల్లుము నాదుశిరంబుపై విభూ
నిశ్చల మోక్షముగా బడయ నేనెద గోరెద సారె సారెకున్
స్వేచ్ఛవు నీద యాలవమె చయ్యన నెంజర గావదా శివా॥

85. ఉ॥ పండిత భక్త సన్నుత విభాకర కోటిసమాన తేజమా
పండిత మిష్ట రాక్షస విశాల దయా హృదయాబ్జ సంయుతా
ఖండిత పాపని విపుడు కాంక్షతో మ్రొక్కెడు నన్ను వేగమే
ఖండిత బుద్ధి బ్రోతువని గాఢపు నమ్మిక బూనితిన్ శివా॥

86. ఉ॥ సర్వ సముండవంచు నిను సమ్మతి గొల్చుచునుందు నిత్యమున్
సర్వము నాదు భారమును చాలెదు మోయగ నీవె యంచునో
సర్వ శరణ్యా నే దలతు చక్కగ నిన్నదయా మహాబ్ధినే,
గర్వహరంబు జేయుచును కావుము నన్నిల వైళమే శివా॥

87. ఉ॥ సోమరి జీవనంబుడివి చొక్కపు నీపదచింత నిచ్చుచున్
యేమరకుండ నన్నవని యెంతయొ ప్రేమను జూచుచున్ విభూ

నేమము దప్పకుండ నిను నెమ్మి భజించెదు నన్ను గావుమా
తామస మానసంబునట ధర్మమునందు నె నిల్పుచుఁ శివా॥

88. ఉ॥ నీదగు మాయ నెందరిల నేర్పున శీఘ్రము దాటు గోరియుఁ
యీదగ లేమి దాటుటకు నెక్కడ పారము లేదటంచు వే
బోధ పడంగ పారమును, బుద్ధియు శక్తియునిచ్చి వారికిఁ
బాధలడంప లేదెమును భవ్యగుణాకర కావుమా శివా॥

89. ఉ॥ బుద్ధియు శక్తియుఁ పటిమపూత చరిత్రయు బొందగా నను
శుద్ధగుణా తలంచెదను శోభితభంగిన నారతంబెదఁ
మద్దురి తంబులఁ యడచి మానని పూన్కి మహాదరంబునఁ
శుద్ధము వంద్యమౌపథము జూపుచు ప్రోవుము వైళమే శివా॥

90. ఉ॥ నేరము లెన్ని యో సలిపి నీచత, నిన్ను దలంపనట్టియా
క్రూరమనస్కుడఁ జడుడకోపిని పాపిని కావుమాకృపఁ
తారక నామ మాయుమకు దారిత దైత్యకు బోధ జేయుచుఁ
భూరి కృపాబ్ధివై చెలగు పూజ్యగుణా యిదె మ్రొక్కెదఁ శివా॥

91. ఉ॥ ఘోరపు దైత్యసంఘములు ఘూర్ణిల కూలెడు గాదె నిన్ననఁ
క్రూరుడు రావణుండు కడు గోడును జెందడె నిన్న దల్చగా

తారుచు నీదుకొండనల దర్పమునన్ బెకలింప గోరుటన్
యేకొకొ నీకుతుల్యులు కవీంద్రను తామల నామ్ర శ్రీశివా॥

92. ఉ॥ వందివలెన్ నుతించుచును భవ్యముగానిను సారె సారెకున్
నందనుఘాతి ని కరుణ నారద వందిత కోరుచుండెదన్
అందముగాగ సేవకుని చందమునన్ నిను గొల్చుచున్ మదిన్
కుందుచుఁ బాపి కావుమని కోరెదనిన్ను మహేశ్వరున్ శివా ॥

93. ఉ॥ రేయిఁ బవళ్ల సంధ్యలను రీతిగ భక్తులగా చెదంచునిన్
పాయని భక్తి మ్రొక్కి మది పాసెడ పాప చమూహమున్ వడిన్
మాయనుఁ జిక్కనీయకయుమా మహిళామణి ప్రాణనాయకా
ఆయువు ధీయునున్ సిరియుహర్షముమీఱ నొసంగుమా శివా ॥

94. ఉ॥ మర్కట చేష్టలన్ మఱచి మక్కువ నిచ్చలు నిన్దలంపగా
తర్కమునేలధన్యుడగు త్వద్దయ నెట్టియుఘాత్ముడేనియున్
మార్కొన విక్రమంబు మఱి మాన్యత మ్రొక్క కృపా పరత్వమున్
అర్క సుధాకరాగ్ని నయనా నిఘమాగానిను బాయదా శివా ॥

95. ఉ॥ వాసము వెండికొండయగు పాపములు నీసఖ సార్వ
రాజముల్
గ్రాసము మానియున్ మిగుల గాఢపు పూనిక పుత్రి
దాల్చెదున్
వేసెను భిక్షుకుండవన వేడ్కను వేషము జన్మమున్ విభూ
వాసిని గాంచెదా వృషభ వాహనుఁడంచును నెయ్యెడన్
శివా

96. కావగ నేర్పదివెగడె నాధవు ప్రేమను భూత జాలమున్
నీవభువిన్ దివిన్ సతము నిక్కపు పూనికఁ బ్రోవకున్నచో
ఏ విధి నెవ్వడే నెపుడు యొంతయు ప్రోవగ జాలునే విభూ
నీవర భక్తుగా సలిపి నిచ్చలు నన్నిట, బ్రోవుమా శివా॥

97. ఉ॥ శక్తి విహీనుఁడౌదువని శాంతము మానుచుదుః
ఖితప్తతన్
ముక్తిద కావరామ నిను పోడిమి దప్పుచుమార నెంచెదన్
భక్తిని ప్రోవగా త్వరగ రాగదె తప్పుల నెంచకుండనో
భక్త జనావనా బిరుద పావవినాశ మ్రొక్కెదన్ శివా॥

98. ఉ॥ పెద్దల సుద్దులన్ దలచి ప్రీతిని మీఱక వాని
నెంతయున్
తద్దయు నీదు భక్తినిల ధర్మపరుండయి సంచరింపగా
కద్దుగ దాయిలన్ ఫలము కల్గునమెల్లను కూలు గాదొకో
శుద్ధ గుణాకరా కరుణజూచెదు భక్తియుతావళిన్ శివా॥

99. ఉ॥ బోయ యొకండు మున్ను నిను పూజలు సేయఁగ గోరుచున్ మదిన్
పాయని భక్తినోటఁ గొని భావిజలంబుల ప్రోక్షఁ సేయఁగా
మాయురె? వానిచేత కెదమత్సర మూనక సంతసించుచున్
పాయఁగ జేయవా? యఘము భక్తుని భక్తియెజూచెదా శివా॥

100. ఉ॥ తీగెయు వృద్ధిఁ బొందుటకు ధీరగుణా తగు కొయ్యకావలెన్
యేగతియున్ కనంబడదు యిప్పుడు నాకిల నీవు దప్పకన్
యేగతి నీదు మాయ నిను యెవ్వడు వీడును నీదు సత్కృపన్
భూగగనంబులందు నిను బోలెడు వాడును గల్గడో శివా॥

101. ఉ॥ నిన్ను దలంచుచున్ మిగుల నిక్కపు భక్తిని మానసంబునన్
యెన్నమ కష్టనష్టముల నింపుగ సేవను సల్పువాడితం
డన్న దయామతిన్ మనిపి యార్త జనావన మూర్తివై విభా
క్రన్నన బ్రోతువంచు నను, కాంక్షతో నీకిదె మ్రొక్కెదన్ శివా॥

102. ఉ॥ నీదగు పాదసేవ మది నిర్మలభక్తిని సేయ గోరుచున్
నీదుసు రూపమున్ మిగుల నిశ్చలతన్ గనుచున్ ప్రభూత్తమా

నాదగు జన్మ శుద్ధమయి నారక బాధలఁ బొందకుండగా
నీదయ నాకు నిమ్మిపుడు నేర్పున ముక్తిని బొందగా శివా||

103. నీదు పదాబ్జయుగ్మ మెద నిచ్చలు వీడక సంచరింపగా
నీదగు సేవనే సలుప నిర్మల మానవ సఖ్య మబ్బగా
నాదును వీడుచున్ మిగుల భవ్యహృదబ్జుల మేలెగోరగా
శ్రీదయితాని జశంభువగు చిన్మయ యిమ్ము వరంబులన్
శివా||

104. సత్సహవాస మగ్న జన సంసరణావృత భీతి హారణా
చిత్సుఖ దాయిరో యుభవ చింతల బాపెదు భక్తపాళికిన్
మత్సకలాఘు హర్తవని మాన్యుని నిన్ను దలంచెదన్ హృదిన్
ఉత్సకతన్ ననున్ మనుపు యూర్వీజనాశ్రయ వేగమే శివా||

105. మందుని పాపమున్ శెలుపమందు గదా భవదీయ నామమున్
కుందునుఁబాపి సౌఖ్యమును గొబ్బున నిచ్చుచు ధన్యు జేయగా
సుందరరూప నీదగు యశోధనమే కదె శక్తివంతమా
మందుడ పాపుడన్ మనుపు మానితభంగిని నన్ను శ్రీశివా||

106. తాపస లోకవందితుని ధర్మపరాయణు లోకనాధునిన్
పాప వినాశ కారణుని పావక లోచను నిసెదన్ విభూ
పాపము డంపగా దలతు పావక కోటి సమాశ్రి ప్రభాయుతా
శ్రీపరమాత్మరో విమల చింతిత సత్ఫలదాయకా శివా

107. నాదగు తండ్రి రోశయ యనంబడు సద్గుణ సాంద్రుడౌ మతిన్
నావగు తల్లి తా తులసి నామమునన్ కరుణాబ్ధి యయ్యెడున్
వేద హితోక్త వాదులయి వీడరు నీదగు భక్తివారిలన్
మాడగు వంశమాను దరిమద్దన ప్రోవుము మమ్ములన్ శివా ||

108 వెంకట సుబ్బయాఖ్యుడను వేడ్క నొసఖ్చితి నీదయన్ కృతిన్
సంకటముల్ హరించుచును సమ్మతి నీకృతిఁ గైకొనంగదే
పొంకముగాఁగ నియ్యది విభూ యెవరేని పఠింప భక్తిచే
పంకములెల్ల పాయుకడు భవ్య సుఖంబులుఁ గల్గు శ్రీశివా॥



